Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ మే నెల 3 వ తేది శనివారం [నె 7 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### విమాన దాడులు.

బ్రిటిషు విమానాలు ఈవారం, ఇదివరకువలె రాత్రుల యందేగాక, పగలుగూడ జర్మనీపైనను శత్రు ఆక్రమిత ప్రాంతాలపైనను తీవ్రమగు దాడులు సాగించుచు, అపారమైన నష్టం కలుగజేశాయి. 24 వ తేది రాత్రి, జర్మనీలో నౌకా నిర్మాణశాలలు అధికంగాగల కీలురేవు పట్టణంమీద, విల్‌హెల్మ్సుహావెన్ మీద, చాలా బ్రిటిషు విమానాలు కెరటాలవలె వెళ్లి చాలగంటల సేపు అగ్నివర్షం కురిపించాయి. ఆ పట్టణాలలో చాలమంటలు లేచి, అనేక గంటలవరకు తగులబడుచునే వున్నాయి. "కొంత నష్టం" కలిగిందని జర్మను అధికారులే ప్రకటించుకున్నారు. జర్మను ఇనుప ఫ్యాక్టరీలుగల ఇజ్మ్యుడ్లన్ అనే పట్నముమీదగూడ చాల బాంబులు వేశారు. 25 వ తేది పగలు నార్వే ప్రాంతంమీద దాడులు సాగించిన బ్రిటిషు విమానాలలో ఒకటి 16,000 టన్నుల పరిమాణంగల స్లై నౌక నౌకదానిని బాంబులువేసి ముంచివేసింది. హాలండు సముద్రప్రాంతంలో గూడ కొన్ని శత్రునౌకలు ముంచివేయబడ్డాయి. శుక్రవారం రాత్రి కీలురేవుమీద బ్రిటిషు విమానాలు మరల దాడి సాగించి క్రొత్త రకపు భయంకరమగు ప్రేలుడు బాంబులను వందల కొలదిగా వర్షించాయి. పగలు, హాలెండు, డెన్మార్కు రేవులపైన దాడులు జరిపాయి. హెలిగోలాండువద్ద రెండు శత్రువు స్లై నౌకలు ముంచివేయబడ్డాయి. ఈ దాడులనుండి 2 బ్రిటిషు విమానాలు మాత్రం తిరిగిరాలేదు. శనివారంనాడు, జర్మనీయందలి పెద్ద పట్టణాలలో రెండవదగు హాంబర్గుపైన దారుణమగు దాడిని సాగించాయి. జర్మనీలోని ఎండెన్, బ్రెమర్‌హావెన్, కాక్సుహావెన్ రేవులపైన వందలకొలది అగ్ని గోళాలను బ్రిటిషు విమానాలు వర్షించివచ్చాయి. ఆ నాడు రెండు విమానాలు తిరిగిరాలేదు. ఆదివారంనాడు, జర్మనీలోని కొలోన్ మొదలగు పారిశ్రామిక ప్రదేశాలమీదను పెద్ద దాడినే సాగించాయి. కొలోనులో చాలమంది హతులైరనీ నష్టం కలిగిందని జర్మనులే అంగీకరించారు. సోమవారం రాత్రి పెద్ద బ్రిటిషు విమానదళం, ఫ్రాన్సు తీరమునగల బ్రెస్టురేవునందింకను నిలచియున్న జర్మను యుద్ధనౌకల పైవందల కొలది బాంబులు వర్షించివచ్చాయి. మంగళవారం రాత్రి జర్మనీ నైరుతి భాగమునగల సుప్రసిద్ధ పారిశ్రామిక నగరమగు "మానల్‌హీం" మీద భయంకరమగు దాడి జరిపాయి. దానితోబాటు 'రాటర్‌డాం' పట్నంలోని నూనె గిడ్డంగుల మీదగూడ బాంబులు వర్షించాయి. ఏప్రిలు 30 వ తేదిన ఎండెను కీలు రేవులవద్దను నౌకా నిర్మాణశాలలను, బర్లిను నగరాన్ని యెదిర్చి వేలకొలది బాంబులువేసివచ్చినవి.

ఏప్రిలు 24 వ తేదీ గురువారంనాడు రాత్రి జర్మను విమానాలు బ్రిటనులో తూర్పు భాగమునను, దక్షిణ ప్రాంతరేవు పట్టణాలమీదను పెద్దదాడినే సాగించాయి. కాని దక్షిణ ప్రాంతపు ఒక్క చిన్న జిల్లామీద తమ దాడిని మరింత కేంద్రీకరించాయి. లండనుపై నాటిరాత్రి విమానదాడులు జరుగలేదు. ప్రాణనష్టముగూడ చాల తక్కువ. శుక్రవారంనాడు బ్రిటనుపై పగలు దాడు లెక్కువగ జరుగలేదు. ఆరోజు రాత్రిమాత్రం ఇంగ్లండు ఈశాన్య తీరపురేవులపై శత్రువిమానాలు తమదాడిని కేంద్రీకరించాయి. ఆస్తికి కొంతనష్టం కలిగింది. ఐర్లండులో అలస్టరు మీదగూడ బాంబులు పడ్డాయి. బ్రిటిషు దక్షిణ తీరంలో బాంబులవలన చాలమంది మరణించిరి. శనివారం రాత్రి, శత్రులు, పడమటి తీరానగల మెర్సిసైడు రేవుపై చాల తీవ్రమగుదాడి జరిపాయి. వాన్నివలన ప్రాణ నష్టంమాత్రం ఎక్కువగా కలుగలేదు. ఉత్తర భాగంలోను, మిడ్లండ్సునందుగూడ, పైనుండి వందలకొలది బాంబులు పడుచు, కొంత నష్టంకలుగచేశాయి. ఆదివారం రాత్రి, లండనుపై విమానదాడి జరుగలేదు. దక్షిణ తీరపు పోర్ట్సుమతు రేవుపైన మాత్రం శత్రువులు తమ శక్తినంతను కేంద్రీకరించి వేలకొలది బాంబుల వర్షించారు. చాలనష్టం కలిగింది.

సోమవారం రాత్రి బ్రిటను లోపల ప్రాంతములలో బాంబులు పడినవిగాని, అన్నిటికంటెను మరల ప్లిమత్ రేవుపైననే శత్రులు తీవ్రమగు దాడిసాగించారు. ఆ దాడి చీకటి పడగానే ప్రారంభమైనది. మొదటి నాలుగంటలలో 10 వేల బాంబులు పడినవి. దాడి అనేక గంటల సేపు జరిగింది. కాని జన నష్టం యెక్కువ లేదు. ఈ విధంగా పదేపదే దాడులు జరుగుచుండటం వలన, అధికారులా పట్నంలో కొంతభాగం ఖాళీచేయించ నిశ్చయించుకున్నారు. మంగళవారం రాత్రిగూడ తిరిగి ప్లిమత్‌పై ఇంత తీవ్రమగు దాడినే సాగించారు. కాని ఆ దాడిలో 8 శత్రు విమానాలు పడగొట్టబడెను. ఏప్రిలు 30 వ తేదిన బ్రిటనుపై విస్తారమగు విమాన దాడులు—లేవు. మే 1 వ తేదిన పగలు దక్షిణ తీరపు పట్నాలపై స్వల్పమగు దాడులు మాత్రమే జరిగెను. ఇంతవరకు బ్రిటనుపై దాడులవలన 29 వేల ప్రజలు మరణించిరి, 40 వేల మందికి గాయములు తగిలెను. ఏప్రిలు నెలలో శత్రుల రాత్రి విమానాలు 69 పడగొట్టబడెను. మార్చి నెలలో బ్రిటనుపైన 100 జర్మను విమానాలు పడగొట్టబడ్డాయి. వీనిలో 75 రాత్రి దాడులలో పడగొట్టబడినవి. ఏప్రిల్ నెలలో 367 శత్రు విమానాలు ధ్వంసం చేయబడ్డాయి. 170 బ్రిటిషు విమానాలు నష్టం అయినాయి.

ప్రధాని చర్చిలు, నౌకామంత్రి ఎ. వి. అలెగ్జాండరు మొదలగు బ్రిటిషు నాయకులు, శత్రుదాడులచే చాలనష్టపడిన మాన్చెష్టరు, లివర్పూలు, ప్లిమత్, పోర్ట్సుమత్ మొదలగు

పట్టణముల దర్శించవచ్చి అచటి ప్రజలు కనుపరచుచున్న ధైర్యసాహసాలను, తమకింత నష్టం కలుగజేసిన జర్మనులకు ప్రతీకారంచేయాలని వారేకనుపరచిన కృతనిశ్చయాన్ని ప్రశంసించారు.

## ఆఫ్రికా, మధ్యధరా రంగాలు.

తూర్పు ఆఫ్రికా రంగంలో బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలు, యింకను అచటచట దాగియున్న ఇటాలియను సైన్యాలను వెదకి పట్టుకొని దేశాన్ని శత్రు రహితంగా చేస్తున్నాయి. ఎరిత్రియానుండి కొంత సైన్యంతో పారిపోయిన ఇటాలియనుల పూస్కో సేనాని, అబిసీనియాలో 8,000 అడుగుల యెత్తుననున్న డెస్సీ అనే కొండదుర్గ ప్రాంతానికి మరలిపోయాడు. అతనిని వెంటాడుచున్న బ్రిటిషు సైన్యాలు గురువారం రోజున డెస్సీని సమీపించి శత్రులను యుద్ధంలోనికి దింపాయి. ఆ యుద్ధంలో 300 ఇటాలియనులు హతులైనారు. 8,000 ఖైదీలుగా పట్టుపడ్డారు. దుర్గం బ్రిటిషు సేనల వశమైనది. మోటా అనే దుర్గాన్ని కూడా బ్రిటిషు వారాక్రమించారు. 26 వ తేది సాయంత్రం, దక్షిణంనుండి వచ్చిన బ్రిటిషు సైన్యాలు, తీవ్రమైన యుద్ధంలో శత్రుల నోడించి డెస్సీ దుర్గాన్ని ఆక్రమించాయి. చాలమంది శత్రు సైనికులు ఖైదీలుగా చిక్కారు. మిగతా సైన్యం, యింకా పశ్చిమంగా గోండార్ అనే పర్వత దుర్గంవైపునకు వెనుకకు మరలి పలాయనమైపోయినది. ఇటాలియను రాజ ప్రతినిధియగు డ్యూక్ ఆఫ్ అవోస్టాగారి సైన్యాలు గిమ్మదుర్గ ప్రాంతంలో వున్నాయి. ఇటాలియను సైన్యాలలోని అబిసీనియనులు వందలకొలదిగా వచ్చి బ్రిటిషు బలంతో చేరుతున్నారు.

అబిసీనియాలో చాల ప్రాంతాలలోను, మాజీ చక్రవర్తి పతాకం యెగురుతున్నది. రాజధానియగు అడిస్ అబాబాలో, చక్రవర్తికి ఘనమగు స్వాగత మొసగుటకు ప్రజలు సన్నాహాలు చేస్తున్నారు.

లిబియాలో (ఉత్తర ఆఫ్రికా) ట్రిపోలీ, బెంఘాజీ రేవులమీద బ్రిటిషు విమానాలు ప్రతిదినం దాడిసాగిస్తు, శత్రువులు ఆ ప్రాంతాలలో సైనికులను ఆయుధసామగ్రిని తెచ్చి దింపుకోడానికి వీలులేకుండా చేస్తున్నాయి. టోబ్రూకు రేవు దుర్గంవద్ద శత్రువులు, దుర్గాన్ని భేదించుకు ప్రవేశించడానికి చేస్తున్న ప్రయత్నాలు ఏమీ ఫలించుటలేదు. లోపలనున్న బ్రిటిషు సామ్రాజ్య సైన్యాలు, ఆకస్మికంగా బయటకువచ్చి శత్రుల పైబడుచు చాల నష్టంకలిగిస్తున్నాయి. 24 వ తేదీన 127 గురు శత్రు సైనికులను ఖైదీలుగాగూడ పట్టుకున్నాయి. 25 వ తేదీన శత్రు విమానాలు కొన్నివచ్చి, టోబ్రూకుపై బాంబులు వేయడం ప్రారంభించాయి. క్రింద క్రికెటు ఆడుకొనుచున్న బ్రిటిషు సైనికులు, ఉక్కు టోపీలను ధరించడానికి ఒక క్షణంమాత్రం ఆగి, తరువాత అంత శత్రు విమాన దాడిలోగూడ యథాపూర్వకంగా తిరిగి తమ ఆటను సాగించుకున్నారు. మే 1 వ తేదీన జర్మనులు టోబ్రూకు దుర్గపు వెలుపలి ప్రాకారాలను చేదింపగల్గినట్లు వార్తలు వచ్చాయి.

లిబియాకు-ఈజిప్టునకు సరిహద్దులలోమాత్రం జర్మను-ఇటాలియను సైన్యాలు, సోల్లందుర్గంవద్ద చాలచోట్ల సరిహద్దులదాటి 26 వ తేదీన ఈజిప్టుపై దాడి ప్రారంభించాయి. 27 వ తేదీన సోలంను ఆక్రమించి, 6 మైళ్లవరకు వచ్చాయి. కాని బ్రిటిషు సైన్యాలు, వాని నచట ప్రతిఘటించి నిలపివేశాయి. ఈ రంగంలోనికి, బ్రిటిషు అధికారులు, తూర్పు ఆఫ్రికానుండి, గ్రీసునుండి అతివేగంగా సైన్యాలను తెచ్చిదించుచున్నారు.

శత్రులు ఇటలీనుండి, ఉత్తరాఫ్రికాకు సైన్యాలు పంపడానికి వీలులేకుండా చేయడానికిగాను బ్రిటిషు నౌకాదళ విమానాలు మధ్యధరా సముద్రంలో కాపలాకాస్తున్నవి. లిబియానుండి ఈజిప్టువరకు, లిబియానుండి టర్కీవరకు గూడ శత్రునౌకలు ప్రవేశించ వీలులేకుండ, సముద్రమంతా మందు గనులను మాటుపెట్టినవి. బ్రిటిషు విమానాలు ప్రతిరోజూ, లిబియా తీరమందలి ట్రిపోలీ, బెంఘాజీ, చెనినా రేవులలో పైకి జని బాంబుల వర్షించి, రేవులను శిథిలంచేసి వస్తున్నాయి. వెనుకనున్న బాటలను, సరఫరా బండ్లను ధ్వంసంచేసి, శత్రు సైన్యాలకు సప్లయిలు అందకుండా చేస్తున్నాయి.

## బాలర్కాను రంగం.

బాల్కనురంగంలో యుద్ధ పరిస్థితులు ఈ వారం విషమించి, గ్రీసులోని సామ్రాజ్యసైన్యాలను, బ్రిటిషు అధికారులు మరలించుకున్నారు. గ్రీసు రేవులనుండి సైన్యాలు నౌకలలో నెక్కి సురక్షితంగా ఆఫ్రికాకు చేరేవరకు, గ్రీకు సైన్యాలును బ్రిటిషు సైన్యాలలో కొంత భాగమున్ను శత్రులను, "థర్మాపలీ" కనుమ వద్దనూ, తరువాత దానికి దక్షిణంగానూ నిరోధించి యుంచాయి. శత్రులు మిత్రమండలి సైనిక పంక్తులను చేదింపవలెనని యెంతో ప్రయత్నించారు కాని, వారికి సాధ్యంకాక పోయింది. తమ అవసరం తీరిన పిదప ఈ సైన్యాలు క్రమంగా వెనుకకు తగ్గడం ప్రాగంభించాయి. 27 వ తేది ఉదయం 9 గంటలకు జర్మను సైన్యాలు, గ్రీసు రాజధానియగు యేథెన్సు నగరాన్ని ప్రవేశించి దుర్గంమీద తమ పతాకాన్ని నాటుకున్నాయి. మిత్రమండలి సేనలు, ఇంకా దక్షిణంగావున్న "పెలిప నీస్" ప్రాంతాలను చేరినాయి. ఆ ప్రాంతపు రేవులనుండి, ఇంకా మిగిలియున్న బ్రిటిషు సైన్యాలను ఉపసంహరించుకొనుపని జయప్రదంగా సాగుతున్నది. 'పెలిపనీసు'నందు కొన్ని బ్రిటిషు సైన్యాలు గ్రీకు సైన్యాలు 30 వ తేదీ వరకుగూడ ప్రతిఘటించుచునేఉన్నవి. 30 వ తేదీన తమ సైన్యాలు దక్షిణ తీరం చేరాయని జర్మనులు ప్రకటించారు. గ్రీసునకుపోయిన 60 వేల బ్రిటిషు సామ్రాజ్యసైన్యంలో 45 వేలు తమ ఆయుధాలతోసహా సురక్షితంగా తిరిగివచ్చినవని చర్చిలు ప్రధాని బ్రిటిషు పార్లమెంటు సభలో ప్రకటించెను. బలువైన పెద్ద ఆయుధ సామగ్రిని మాత్రం వదలివేయవలసి వచ్చింది. గ్రీసు యుద్ధంలో హతులైనవారుగాని, క్షతగాత్రులుగాని 3000 మందికంటె యెక్కువయుండరని బ్రిటిషు అధికారులు లెక్కవేశారు.

జర్మనులకు ముందుగలొంగిపోయిన ఎపిరస్ ప్రాంతపు సైన్యాధిపతియగు సోలాకిగ్లు సేనాని నాయకత్వం క్రింద జర్మనులు గ్రీసులో, ఒక మాయ బొమ్మ ప్రభుత్వం నెలకొల్పిరి.

గ్రీసుకు తూర్పువైపునగల కథోలినియా జాంటే, లూకాస్ అను దీవులను తామాక్రమించుకున్నామని ఇటాలియనులు మే 1 తేదీన ప్రకటించారు.

బాల్కను యుద్ధ ఫలితమును గురించి సోవియటు రష్యా సైనికాధికారులు చర్చిస్తూ మధ్యధరాసముద్ర తూర్పు ప్రాంతమున బ్రిటిషు ఆధిపత్యమున కింతవరకు ఏ మాత్రమును భంగము కలుగలేదనీ, సూయజు, సైప్రెస్, క్రీటు, అలెగ్జాండ్రియా ప్రాంతాలను సంరక్షించుకొనుటకు కావలసినంత బలం ఇంకా బ్రిటనుకు గలదనీ ప్రకటించారు.

మధ్యధరా సముద్రంలోని బ్రిటిషు నౌకానిలయముగు మాల్టాదీవిపైనను, రేవు దుర్గంమీదను శత్రువులు తరుచా విమాన దాడులు సాగించుచున్నారు. మంగళవారం రాత్రి జరిగిన దాడివలన కొందరు ప్రజలు మరణించారు

జర్మనులు గ్రీసును ఆక్రమించిన తరువాత, తూర్పుననున్న ఈజియన్ సముద్రంలోని సామోత్రేసును, డార్డనెల్సు జలసంధి యెదుటవున్న లెమనాస మొదలగు దీవులనుగూడ ఆక్రమించుకున్నటుల ప్రకటించారు.

గ్రీసు ప్రభుత్వం మాత్రం, క్రీటాద్వీపమునుండి, స్వాతంత్ర్య పోరాటాన్ని సంపూర్ణ విజయం లభించేవరకు సాగించడానికి నిశ్చయించుకుంది. ఇందుకుగాను అనేక లక్షల టన్నుల పరిమాణంగల తన వర్తక నౌకలనన్నిటిని బ్రిటిషు ప్రభుత్వంవారి స్వాధీనపరచింది.

## టర్కీ--ఈరాక్--ఈరాన్.

జర్మనులు, ఈజియను సముద్రమందలి గ్రీకుదీవుల నాక్రమించుటవలన, టర్కీ అధికారుల ఆందోళన అధికమైనది. టర్కీ అధ్యక్షుడగు ఇనూనూగారు 25 వ తేదీ సాయంత్రం, రాజధానియగు అంకారానుండి యెక్కడికో రహస్యంగా ప్రయాణమై వెళ్లేరనీ, మంత్రులు, పెద్ద ప్రభుత్వోద్యోగులు స్టేషనువద్ద వీడుకోలు ఇచ్చారనీ వీశ్లీ వార్తా సంఘానికి, అంకారాయందలి విలేఖరి తెలియజేశాడు. జర్మను భయాన్ని తప్పించుకోవడం కోసం, టర్కీ, రష్యా, ఈరాన్, పర్షియాలుకలసి, మిత్రమండలిగ యేర్పడాలని టర్కీ పత్రికలు సూచిస్తున్నాయి. ముందు జాగ్రత్తకోసం అధికారులు "ఇస్తాంబుల్" పట్నంనుంచి, ప్రజలను ఖాళీచేయిస్తున్నారు. ఆంగ్లేయాధికారులుగూడ, ఇస్తాంబులలో ప్రత్యేకంగా పనివున్నవారుతప్ప మిగిలినవారందరు ఖాళీచేసి వెళ్లవలసిందని ఆంగ్లేయులను హెచ్చరించారు.

జర్మనీ టర్కీ ప్రభుత్వములు ఈమధ్య కుదుర్చుకొనిన వర్తక యొడంబడికను, టర్కీ శాసనసభవారు ఏప్రిలు 28 వ తేదీన ఆమోదించిరి.

ఈరాక్‌లో బ్రిటిషుసైన్యాలు దిగటంవలన టర్కీకి కొంత ధైర్యం కలిగింది. ఈరాక్‌లోని బ్రిటిషురాయబారి, 26 వ తేదీన, క్రొత్త ఈరాకు ప్రభుత్వ మంత్రులను దర్శించి సంభాషించాడు. ఆ ప్రభుత్వానికి, బ్రిటిషువారికి పూర్వపు అన్యోన్యభావం తిరిగి త్వరలోనే యేర్పడుననే ఆశను బ్రిటిషురాయబారి ప్రకటించాడు. ఈరాక్‌లోని పత్రికలలో కొన్నిమాత్రం ఇంకా అక్సిసు విజయాలనే పొగుడుతూ వ్రాస్తున్నాయి. కాని బ్రిటిషుసైనికుల రాకవలన, ఈరాక్‌లోనే గాక, ఈరాన్ (పర్షియా)లో గూడ, ప్రజలకు కొంతధైర్యం కలిగింది. బ్రిటిషువారు ఏప్రిలు 29 వ తేదీన ఈరాక్‌లో క్రొత్తగా మరికొంతసైన్యం దింపారు. ఇదివరకు దింపిన సైన్యాలు దేశందాటిపోవువరకు క్రొత్తసైన్యాలను దింపరాదని ఈరాక్ ప్రభుత్వం ఆక్షేపించింది. ఈ విషయమై ఉభయప్రభుత్వాలకు మాటలు జరుగుతున్నాయి.

## అమెరికా సంయుక్త రాష్ట్రాలు.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో, జర్మను దురాక్రమము గురించి ఆందోళన అధికమగుతున్నది. అక్షరాజ్యాలను ఓడించి నిర్మూలించడానికి, యెట్టి విధానానికైనా అమెరికా ప్రజలు సిద్ధపడుదురని, దేశీయాంగ కార్యదర్శియగు కార్డలు హల్లుగారు, నౌకాదళశాఖ కార్యదర్శిగారుగూడ బహిరంగంగా ప్రకటించారు. ఈ యుద్ధంలో బ్రిటను ఓడిపోతే, ఇక అమెరికా ఒక్కటి ఏ కాకియై, పూర్వార్ధగోళమంతా వ్యాపించియుండు శత్రుమండలితో పోరాడవలసివస్తుందనీ, అందుచే బ్రిటను ఓడిపోకుండాచేయడం అమెరికాకు అవసరమనీ హల్లుగారు హెచ్చరించారు. అమెరికా బ్రిటనుకు పంపే సహాయం, శత్రులచే సముద్ర గర్భంలో పడకుండాచేసే బాధ్యత అమెరికనుల దన్నారు. ఏప్రిల్ 25 వ తేదిన రూజ్వెల్టు అధ్యక్షుడు, పత్రికావిలేఖరులతో ప్రసంగిస్తూ, బ్రిటనుకు పదార్థాలు తీసుకువెళ్ళే నౌకలకు అమెరికను యుద్ధ నౌకలను తైనాతీ ఇవ్వడాన్ని గురించి ఏమీ వెల్లడించుటకిష్టపడలేదు. కాని సప్తసముద్రాలలోను వేగుచూచి గస్తీ తిరుగడానికి అమెరికను యుద్ధ నౌకలనుపయోగిస్తామన్నారు. ఆ నౌకలు శత్రు నౌకల అచూకీని కనిపెట్టి తెలియచేస్తుంటే, బ్రిటిషు నౌకలు సురక్షితంగా సరకుల తెచ్చి ఇంగ్లండులో దింపుకోగల్గుతాయి. బ్రిటనుకు సరకులు చేరేవరకుగూడ, వర్తక నౌకలకు అమెరికా యుద్ధ నౌకల సహాయమియ్యవలసినదని అమెరికాలో వెండెలు విల్కీగారు, ఇతర ప్రముఖులు, చాల పత్రికలు చెలుపుతున్నారు.

అమెరికా రాష్ట్రాల సలహా సంఘంవారు 25 వ తేదీన వాషింగ్టనులో సమావేశమై అమెరికా రేవులలో వ్యర్థంగా వుంటున్న 160 అక్ష-రాజ్యాల నౌకలను ఇతర దేశాల నౌకలను స్వాధీనపరచుకొని ఉపయోగించుకొనవలెనని శిఫార్సు చేశారు. ఈ సమితిలో 21 అమెరికా రాష్ట్రాలు చేరి వున్నాయి.

అమెరికానుండి వచ్చిన చాలమంది వైమానికులు బ్రిటనులో విమానాలను నడపుచున్నారు. యుద్ధంలో దిగితే, అమెరికా రెండు వైపులనుగల మహాసముద్రాలన్నిటిని ఒకేమారు రక్షించుకోడానికి, యునైటెడు స్టేట్సు ప్రభుత్వం క్రొత్తగా 6 పెద్ద యుద్ధ నౌకలను నిర్మించడానికి ప్రారంభించింది.

అమెరికా పెట్రోలు యుద్ధ నౌకలు యుద్ధం జరుగుచున్న ప్రాంతాలకుగూడ పోవచ్చునని అమెరికా అధ్యక్షుడు ప్రకటించాడు. ఈ విధంగా ప్రవేశిస్తే, ఇతర సముద్రాలలోగూడ గస్తీ తిరుగుటకు అమెరికను యుద్ధ నౌకలను పంపిస్తే, జర్మనీకి అమెరికాకు సంఘర్షణ సంభవించునని, జపానునందలి అసాహి పత్రిక వ్రాసింది.

నూనె తీసుకొనిపోవుటకుపయోగించు 50 నౌకలను బ్రిటనుకిచ్చుటకు యునైటెడు స్టేట్సు ప్రభుత్వం నిశ్చయించింది.

## ఆక్రమిత దేశాలు.

యుగోస్లావియా రాజధానియగు బెల్గ్రేడులో జర్మను బాంబులవలన 20 వేల ప్రజలు హతులైరి. నగరము పూర్తిగ శిథిలమైపోయెను. యుగోస్లేవియాలో మనోస్టరు నగరును, ఫ్లోరినాప్రాంతమును బల్గేరియా సైన్యాలు ఆక్రమించెను. అక్కడ యుగోస్లావియా అధికారుల తొలగించి బల్గేరియా అధికారు లాక్రమించడం ప్రారంభించారు.

## విషీ.

జర్మనులు అడుగుచున్న సౌకర్యాలగురించి చర్చించుటకుగాను, విషీ మంత్రి వర్గం ఏప్రిలు 26 వ తేదిన పెటెయిను సేనాని అధ్యక్షతను సమావేశమయి ఉపప్రధాని డార్లన్ గారు తెలిపిన విషయములను విని చర్చించిరి. స్పెయినునందలి రాయబారిని రప్పించి, అచ్చటి వ్యవహార పరిస్థితులనుగూడ సమాలోచన మొనర్చిరి. ఫ్రాన్సుగూడ అక్షరాజ్యాలతో చేరి కలసి పనిచేయవలసినదనీ, ఆఫ్రికా ఉత్తరపు ట్యునీసియా మొరాకోలలో సైన్యాల దింపుకొన నియ్యవలసినదనీ జర్మనులు కోరిరని వదంతులు వ్యాపించియున్నవి. ఇటీ

వల ఇటాలియను అధికారులు కొందరు కార్సికాద్వీపమునకు వచ్చినపుడచటి ప్రజలు ప్రతికూలార్భాటములు గావించిరి. వానిని సాగనిచ్చినందుకుగాను విషీ ప్రభుత్వంవారు కార్సికాయందలి ఫరాసు గవర్నరగు పెటిటు జీన్ గారిని పదవినుండి తొలగించిరి.

ఈ యుద్ధంలో అక్సిసులో చేరకుండ తటస్థంగావుండ వలసినదనీ, జర్మనీయెడల అనుకూలభావంతో వ్యవహరిస్తే, ఫ్రాన్సునకు అమెరికానుండి ఆహార పదార్థాల సహాయానికి భంగంకలుగుననీ, విషీయందలి అమెరికా రాయబారియగు అడ్మిరల్ లీహీగారు, పెటెయిన్ సేనానిని స్పష్టంగా హెచ్చరించాడు.

## దూర ప్రాచ్యం.

దూర ప్రాచ్యంలోగూడ వ్యవహారాలు వ్యగ్రరూపం తాలుస్తున్నాయి. సోవియటు-జపాను నిరాక్రమణ యొడంబడికను, జపాను ప్రీవీ కౌన్సిలువారు ఏప్రిల్ 24 వ తేదీన ఆమోదించి ధృవపరచారు. రష్యా సోవియటు "సుప్రీం కౌన్సిలు" వారు 25 వ తేదీన ఆమోదించి ధృవపరచారు. శనివారం నుంచి ఈ యొడంబడిక అమలులోకి వచ్చింది. ఈ విషయం జపాను విదేశాంగ మంత్రి మట్సు ఒకాగారు, రష్యా ప్రభుత్వాధ్యక్షుడగు స్టాలినుకు, విదేశాంగమంత్రియగు మాలటాఫునకు తెలుపుచు "తాను ఇచ్చినమాటను జపాను తుదివరకు నిలబెట్టుకుంటుందనిన్నీ, రష్యాగూడ అట్లే నిలబెట్టుకొనునని నమ్ముచుంటి"నని తంతివార్త నంపాడు. ఈ యొడంబడికచే ఉభయజాతులు నెలకొల్పుకొనిన స్నేహాన్ని, సహకారభావాన్ని యెవుడు విస్మరింపమని వారుభయులు ప్రత్యుత్తర మిచ్చారు.

పై యొడంబడికచే కలిగిన అవకాశాన్ని ఉపయోగించుకొని జపాను, సయాంపైన బర్మాపైన దండెత్తునని చైనా సైనికాధికారియగు సూపెరింగువారు జోస్యం చెప్పిరి. ఇండో-చైనా అధికారులు జపానీయులకు ఆటంకాలు కల్పించుచున్నారని జపాను వార్తాపత్రికలు ఆందోళనను ప్రారంభించాయి. జపాను త్వరలోనే దక్షిణ ఇండో-చైనా నాక్రమించునని, షాంగుహైలోని తటస్థ రాష్ట్ర రాజకీయజ్ఞులు అనుకుంటున్నారు. గతవారం జపాను సైన్యాలు, చైనా రేవులను ఆక్రమించాయి. దానికి జవాబుగా చైనా సైన్యాలు ఏప్రిల్ 26 వ తేదీన చెకియాంగ్, ఫ్యూకేన్, హూపే రాష్ట్రాలలో చైనా సైన్యాలు జపాను సైనిక పంక్తులపై దాడి ప్రారంభించాయి.

ఆస్ట్రేలియాలోని జపాను రాయబారియగు కవాయిగారు మెల్బోర్న్‌లో ప్రసంగిస్తూ ఆస్ట్రేలియాను ఆక్రమించు ఉద్దేశం జపానుకు లేదని అభయమిచ్చారు. మలయాయందలి ఆస్ట్రేలియా సైన్యాల ప్రధాన సేనానియగు మేజరు జనరలు హెన్రీ బార్డన్ బెన్నెటుగారు ప్రసంగిస్తూ దాడి వస్తుందని ఆస్ట్రేలియనులు అలజడిచెందుచున్నారనీ, అయితే ఎవరు దాడివచ్చినా మలయా, సింగపూరులు ప్రతిఘటించి తిరుగగొట్టగలవనీ హెచ్చరించాడు.

షాంగుహై నగరంలో, చైనా ప్రభుత్వంవారి తాలూకు బ్యాంకులలోని అధికారులు కొందరిటీవల దుండగీండ్రచే హత్య చేయబడడంవలన భయపడి బ్యాంకులను కొన్ని రోజులు మూసివేశారు. కాని 28 వ తేదీనుండి తిరిగి తెరిచారు. ఈవిధంగానే, జపాను అనుకూలురగు నాంకింగు ప్రభుత్వం తాలూకు అధికారులుగూడ ఒకరిద్దరు హత్యచేయబడ్డారు.

చైనా ప్రభుత్వపు డాలరు నాణెముల చలామణిని నిలబెట్టుటకుగాను బ్రిటిషు ప్రభుత్వంవారు చైనాకు 50 లక్షల పౌనుల ఋణము నొసగుటకు నిశ్చయించిరి. అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వంవారు 125 లక్షల పౌనుల నొసగుటకు నిశ్చయించిరి.

జపాను విమానాలు, చైనాలో చాల ప్రదేశాలపైన అందు ముఖ్యంగా, బర్మా రోడ్డు చివరనున్న కుమ్మింగుపట్నంమీద బాంబులు వేశాయి. జపాను నౌకాదళ సైన్యాలు కెయిజీమీనూ అను చైనా దక్షిణ రేవును 2 వ తేదీన ఆక్రమించాయి.

రూజ్వెల్టు అధ్యక్షుని కుమారుడగు జేమ్సు రూజ్వెల్టుగారు 29 వ తేదీన అమెరికానుండి చంకింగునకు చేరి అచట చాంగ్ కై షేక్ సేనానితో చాలముఖ్యమగు సంప్రదింపులు జరిపెను. చైనాకు సంపూర్ణమగు సహాయం పంపెదనని రూజ్వెల్టు అధ్యక్షుడు చాంగ్ కై షేకునకు సందేశమంపెను.

## తటస్థ దేశాలు.

హిట్లరుయొక్క ప్రతినిధియగు హెర్ హెస్సుగారు స్పెయినుకువెళ్లి అచట స్పెయిను ప్రభుత్వంతో సంప్రతింపులు సాగించాడు. స్పెయినుగూడ అక్సిసు రాజ్యాలతో కలసి యుద్ధంలో దిగవలెననీ, జిబ్రాల్టరు రేవును ఆక్రమింపవలెననీ, అటుల కానిచో జిబ్రాల్టరుపైకి జర్మను సైన్యాలను పంపుటకు స్పెయినుగుండా రహదారీ యొసగవలెననీ హెస్సుగారు కోరినట్లు పత్రికా విలేఖరులు తెలుపుచున్నారు. బ్రిటిషు వారికి ఐరోపా భూభాగములో ఏమాత్రం పలుకుబడి లేకుండా చేయడానికిగాను పోర్చుగలును గూడ ఆక్రమించడానికి జర్మనులుద్దేశిస్తున్నారని, అందుకు ప్రారంభంగా అక్సిసు నాయకత్వాన్ని అంగీకరింపవలసినదని పోర్చుగలును వత్తిడి చేస్తున్నారనిగూడా అంటున్నారు. శత్రులు జిబ్రాల్టరు దుర్గంపైన దాడి జరిపితే నిరోధించడానికి, కావలసిన సైనిక నౌకా విమానబలము ఆయుధ ఆహార సామగ్రులు, జిబ్రాల్టరునందలి అధికారులు సిద్ధంచేసుకుపుంచారు ఫ్రాన్సు యుద్ధంలో బ్రిటిషు సేనానిగ పనిచేసిన గోర్టు ప్రభువును, జిబ్రాల్టరు దుర్గానికి అధికారిగ, బ్రిటిషు ప్రభుత్వమువారు నియమించిరి.

అయిర్లండుకు ముందుగా ఏ విధమగు హెచ్చరికయు లేకుండానే శత్రుదాడి కలుగవచ్చు. దానిని నిరోధించడానికి ప్రజలు సిద్ధంగా వుండవలెనని అయిర్లండు ప్రభుత్వాధ్యక్షుడగు డెవిలీరాగారు శాసనసభలో హెచ్చరించాడు. శత్రుదాడిని నిరోధించడానికి 250 వేల బలగం సిద్ధంగా వున్నదని కూడా తెలియజేశాడుకాని వారికి తగిన ఆయుధ సంపత్తి లేదన్నాడు. ఐర్లండు ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని, తేయాకు పెట్రోలు మొదలగు పదార్థాల కొరకు విక్రయించుకోమనీ జాతీయ స్వాతంత్ర్యం కొరకు తుదివరకూ పోరాడెదమని, ఐర్లండు ప్రభుత్వము మంత్రి సీన్ లెమాస్‌గారు ప్రకటించారు.

స్విట్జర్లండునుండి అక్షరాజ్యాలకు ప్రతికూలమైన ప్రచారం సాగుచున్నదని ఆరోపించి ఈ విధంగా వ్యవహరిస్తే స్విట్జర్లండుపై అక్షరాజ్యాలు చర్య తీసికోవలసి వస్తుందని రోము రేడియోలో ఇటలీ ప్రభుత్వ నాయకులలో ఒకరగు సీనరు ఎజియో, మారియో గ్రేగారు హెచ్చరించారు.

సోవియటు రష్యా ప్రభుత్వం జర్మనీతో తనకుగల సరిహద్దు పొడుగును త్వరితంగా సైన్యాలను కేంద్రీకరించుచున్నదనీ, జర్మను లిదివరకే పోలండులో తమ సైన్యాలను కేంద్రీకరించినందుకు ఇది ప్రతిక్రియయనీ, అంకారా రేడియో స్టేష

ను ప్రకటించింది. ఇకమీద రష్యాగుండా యుద్ధ సామగ్రిని రవాణా చేసుకోడానికి వీలులేదని సోవియటు ప్రభుత్వం ఉత్తరువు గావించింది. దీనివలన జర్మనీ జపానులు పరస్పరం రష్యా మీదుగా ఆయుధ సామగ్రులను పంపుకొనుటకు వీలుండదు. అందుచే ఈ యుత్తరువు జపాను సైనికాధికారులకు చాల అసంతృప్తి కల్గించింది. ఈ యుత్తరువువలన రష్యానుండి తమకువచ్చు ఆయుధ సామగ్రికి భంగం కలుగదని చైనా అధికారులనుచున్నారు.

మే 1 వ తేదీన ఉత్సవాలరోజున సోవియటు సైనికమంత్రి మార్షలుటిమోషెంకోగారు ప్రసంగిస్తూ, రష్యా తన సైన్యాలను సమీకరించి సిద్ధంగా వుంచుకోవలెనని ప్రకటించాడు. జర్మనీ సరిహద్దులో సోవియటులు 63 డివిజనులను కేంద్రీకరించి వుంచినట్లు వార్తలు వస్తున్నాయి.

## నౌకా నష్టములు.

ఏప్రిలు 17-23 వ తేదీల వారములో 42,000 టన్నుల పరిమాణంగల శత్రు నౌకలు నార్వేనుండి ఫ్రాన్సువరకుగల జర్మను ఆక్రమిత తీర సముద్ర భాగాలలో ముంచివేయబడినవి.

## శత్రు టాంకరు నౌక మునుగుచున్న దృశ్యము.



రాయలు విమాన పైలెటు బాంబువేయగా శత్రు టాంకరు నౌక ఇంగ్లీషు చానెలులో మునుగుచున్నది. ఈ దృశ్యము నతడు పైనుండి చూస్తున్నాడు. రాయలు విమానము లెప్పుడు భూమిమీదను సముద్రముమీదను గస్తీ తిరుగుచునే ఉంటాయి.

# అట్లాంటికు మహాయుద్ధం.

## ఇంగ్లాండుకి అమెరికా ఎక్కువ సహాయం చేస్తున్నది

ఇంగ్లాండుకి రాదారి మార్గాలు, సరకు రవాణాలు నిరోధిస్తేనే కాని తాను జయించలేనని హిట్లరు గుర్తించేడు. అందుకనే అట్లాంటికు సముద్రమునందు నౌకలను ముంచివేయుటకు తిరిగి ప్రయత్నం చేస్తున్నాడు. మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకాదళం బయటకు రాకుండాకూడా చేయాలని చూస్తున్నాడు. బాల్కను రాజ్యాలను ఆక్రమించగల్గినా, యీ రెండో పని హిట్లరు చేయలేకపోయెను. ఇక ముందుగూడ చేయలేడు. ఏమంటే, లిబియాలోని జర్మనీ సేనలు సూయజుకాల్వ చేరకుండా ఈజిప్టులోని నైలు సైన్యం అడ్డుతుంది. అధ్యక్షుడు రూజువెల్టుగారు అమెరికా తటస్థ చట్టం ప్రకారం, ఎర్రసముద్రం యుద్ధరంగంగా పరిగణించక, అచటి మసావా రేవునకు తమ సరకు నౌకలు పోవచ్చునని ఉత్తరువు చేసెను. తద్వారా మధ్య ప్రాచ్యమునకే సరాసరి అమెరికా స్టీమరులు, సరకు రాగలవు.

కావున, అమెరికాలో బ్రిటిషు రాయబారిగానున్న హాలిఫాక్సు ప్రభువుగారు చెప్పినట్లు అట్లాంటికు సముద్రంలో జరిగే యుద్ధమే యీ యుద్ధ ఫలితాన్ని నిర్ణయించగలదు. అమెరికానుండి వచ్చు యుద్ధ సామగ్రి నౌకలను అట్లాంటికు సముద్రంలో ముంచివేయుటకు, హిట్లరు సబ్‌మెరైనులను, యుద్ధ నౌకలను, విమానాలనుకూడ ఉపయోగిస్తున్నాడు. ఇచటి ప్రమాదాన్ని చర్చిలుగారుగూడ తమ ఉపన్యాసంలో నొక్కి చెప్పిరి. బ్రిటను యింతవరకు యుద్ధంలో 40 లక్షల టన్నుల నౌకలను నష్టపోయింది. వాటికి బదులుగా 30 లక్షల టన్నుల నౌకలు యితర దేశాలవి ఇంగ్లాండుకి లభించేయి. ఈ రీతిగా నష్టం యికముందుకూడా జరుగుతూవుంటే, 1942 లో యుద్ధ ప్రయత్నం తగ్గవచ్చును. కాని స్టీమరు నిర్మాణం, పరిశ్రమలు అత్యంత వడిగా అభివృద్ధి అవుతున్నాయి. ఈ అభివృద్ధి కొనసాగించుటే హిట్లరుకి తగిన జబాబు.

### జరుగుచున్న పని.

బ్రిటిషువారు వర్తక నౌకలు యెక్కువగ నిర్మించుచున్నారు. రేవులు చేరిన నౌకలు తిరిగి వెంటనే పంపబడుచున్నవి. అమెరికానుండి ఎక్కువ నౌకలు రప్పింపబడుచున్నవి. సబ్‌మెరైనులను ముంచే ప్రయత్నాలు ఎక్కువ జరుగుతున్నాయి. పని ఎక్కువ జరుగుటకు బ్రిటిషు రేవులలో కార్మికుల నిబంధనలు అనుకూలంగా మార్చబడినవి.

అమెరికానుండి 950 వర్తక నౌకలు, 913 సైన్యానికి కావలసిన నౌకలు తెప్పించుటకు యేర్పాటుచేయబడింది. అవసరమైతే 25 లక్షల టన్నుల నౌకలను పంపుటకు అమెరికా సిద్ధంగావుందని అమెరికా నౌకా నిర్మాణోప సంఘాధ్యక్షుడు ప్రకటించెను. అంటే, 1918 వ సంవత్సరములో జర్మనులను అణచివేయుటకు తోడ్పడినంత యెక్కువగ నౌకా నిర్మాణమును అమెరికా యిపుడు చేయుచున్నదన్నమాట. ఇదికాక అమెరికా రేవులలోనున్న శత్రురాజ్యాలవి, విదేశాలవి అగు నౌకలన్నింటిని, సుమారు 100, అమెరికా ప్రభుత్వం వశపరచుకొంవి. వాటిని ఇంగ్లాండునకు యిచ్చివేయుటకుగూడ తగిన అధికారం అధ్యక్షునకు వొసంగుచు ఒక చట్టం చేయబడుచున్నది.

జర్మను జలాంతర్గాములు (నీటిలో కనబడకుండాపోయి స్టీమరులను ముంచే పడవలు) ఏ రేవులనుండి బయలుదేరి వస్తూవుంటాయో, ఆ బ్రెస్టు, లా ఓరియంటు రేవులపై రాయలు విమానాలు విపరీతంగా బాంబులువేసి జలాంతర్గాములను ముంచుచున్నవి. అయినా అదివరకే అట్లాంటికు సముద్రం చేరినవాటిని ముంచివేస్తేగాని, అమెరికానుండి సరకు నౌకలకు భద్రతయుండదు. ఇటీవల వాటి సంఖ్య యెక్కువైంది. బ్రిటిషువారు చేయుచున్న ప్రతికూల చర్యలు కూడ యెక్కువగుతున్నాయి. జర్మను జలాంతర్గాముల పెద్ద వుద్యోగులు 50 మంది, చిన్న నావికులు 400 మంది బ్రిటిషువారికి ఖైదీలుగ పట్టుబడిరి.

### 50 అమెరికను యుద్ధ నౌకలు.

గత యుద్ధంలో ఐదు రాజ్యాల నౌకా దళాలు చేయవలసిన పని, యీ యుద్ధంలో బ్రిటిషు నౌకాదళం చేస్తున్నది. కనుక బ్రిటిషు యుద్ధ నౌకలకు యెక్కువ శ్రమగలదు. అమెరికా ఆ విషయం గుర్తించియే, నిరుడు 50 యుద్ధ నౌకలను తనవి ఇంగ్లాండునకు పంపెను. ఇవి, జర్మను రేడియోలో చెప్పినట్లు చెడిపోయినవి, పనికిరానివి కావు. గత యుద్ధానంతరమే కట్టబడినవి. చిన్న ఫిరంగులుగలవి. అతివడిగాపోవును. ఇవి సామాను నౌకలకు [illegible]గా వుండుటకు యెంతయో పనికివచ్చును. వీటికి బదులుగ ఇంగ్లాండు అమెరికాకు అట్లాంటికు సముద్రమున కొన్ని రేవు స్థలములను కౌలుకి యిచ్చింది. ఈ వత్సరం ప్రారంభములో 2,000 టన్నుల నౌకలు పదింటిని అమెరికా ఇంగ్లాండుకి యిచ్చింది.

### అమెరికాకు క్రొత్త రేవులు.

అమెరికాకు ఇంగ్లాండు యిచ్చిన రేవు స్థలములు యింతకన్న యెక్కువ వుపయోగకరమైనవి. అమెరికా చుట్టు 3 మైళ్లు మాత్రమే కాక 300 మైళ్లవరకుగూడ తన సముద్రంగానే యెంచి అమెరికా రాజ్యాలు రక్షించుకుంటాయని, పెనామా కాంగ్రెసులో నిర్ణయింపబడింది. ఇపుడీ క్రొత్త రేవులందు అమెరికా నౌకాదళ శిబిరాలు యేర్పరచుకొనిన యీ పని కెంతో తోడ్పడును. హిట్లరుని అట్లాంటికు సముద్రంలోనికి రానివ్వకుండా అమెరికా చేస్తుందని ప్రపంచమందరికిగూడ తెలిసింది. ఈ ఎనిమిది రేవు స్థలములు న్యూఫౌండులండు, బెర్ముడా, బాహమాసు, జమయికా, అంటిగువ, సెంటు లూసియా, ట్రినిడాడు, బ్రిటిషు గయానాలందు కలవు. ఈ రేవులందు కోట్లకొలది పైకం వెచ్చించి శిబిరాలు ఏర్పరచడంవలన అమెరికా నౌకాదళం ప్రపంచమంతటిలో ఎక్కువ శక్తివంతము కాగలదని అమెరికా నౌకాశాఖ మంత్రి కర్నలు ఫ్రాంకు నాక్సుగారన్నారు. అమెరికా తీరాన న్యూఫౌండులండునుండి అట్లాంటికు సముద్రంమీదుగా పసిఫికు సముద్రమునందు హవాయివరకు గూడా 2,100 మైళ్లమేర అమెరికా నౌకాదళం శిబిరాలు విస్తరించియున్నవి.

### గ్రీన్‌లాండు రేవుల ఆక్రమణ.

అట్లాంటికు సముద్రానికి ఉత్తరానయున్న గ్రీనులండు దీవి డెన్మార్కు రాజ్యంలోనిది. కాని యూరపులో ఉన్న డెన్మార్కు దేశాన్ని జర్మనీ ఆక్రమించినా డెన్మార్కుయొక్క వలస రాజ్యాలు తమ స్వాతంత్ర్యం కోల్పోలేదు. అందుచే అమెరికాలోనున్న డెన్మార్కు రాయబారితో అమెరికా ఒక ఒడంబడిక గావించుకొని గ్రీనులాండులో నౌకా శిబిరాలు విమానదళ శిబిరాలు నిర్మించుటకు హక్కును బడసెను. ఇవి అమెరికానుండి ఇంగ్లాండుకి యుద్ధవిమానాలుగాని, స్టీమరులుగాని పోవుటకు మధ్యమకాంగా ఉపయోగపడును. యుద్ధానంతరం డెన్మార్కు స్వాతంత్ర్యం బడసినచో యీ రేవు స్థలాలను తిరిగి డెన్మార్కునకు యిచ్చివేతుమని అమెరికా ఒప్పుకున్నది. బ్రిటిషు రేవుల ఒడంబడికవలెనే

యీ గ్రీనులండు రేవుల ఒడంబడికగూడ లాభకరమైనదే. గ్రీనులాండు సీతకాలంలో మంచుతోనిండియున్నను ఎండకాలమునందు విమానాలు దిగుటకు వీలుగనుండును. ఇది అమెరికాతీరానికి 800 మైళ్లు, బ్రిటిషువారిదగు స్కాటులండు తీరానికి 650 మైళ్ల దూరంలో ఉంది. దీనికి దిగువగనున్న ఐసులండు దీవిని బ్రిటిషువారు యిదివరకే వశపరచుకొన్నారు. ఇదియు డెన్మార్కుదే. ఈ రెండుదీవులు చేజిక్కుటచే అమెరికానుండి విమానాలు స్టీమరులపై మోసుకపోవలసిన అవసరం లేకుండా ఎగిరివచ్చి యిచట దిగి తిరిగి ఇంగ్లాండునకు ఎగిరిపోవుటకు సులభంగా ఉండును. ఈ దీవులు కనడా రక్షణకు కూడ ఉపయోగపడును.

కనడా, అమెరికా సంయుక్త రాష్ట్రాలకు ఉత్తరంగా ఉన్న బ్రిటిషు వలసరాజ్యం. అమెరికా ఖండం అంతటి రక్షణ బాధ్యత అమెరికా సంయుక్తరాష్ట్రాలపైగలదు. అయినను అమెరికా తటస్థచట్టం ప్రకారం కనడా రేవులకు అమెరికా నౌకలు పోరాదు. ఈ నిబంధన అమెరికా ఇంగ్లాండుకి చేసే సహాయానికి నిరోధంగా ఉంది. ఇపుడు గ్రీనులాండులో శిబిరాలను ఏర్పరచుకొని, ఉత్తర నౌకామార్గమును కనిపెట్టినచో పడమటి ప్రపంచ రక్షణ బాధ్యతను అమెరికా బాగుగ నిర్వహించగల్గును. అమెరికా తాటస్థ్యం కాపాడడానికై సముద్రాలలో శత్రు నౌకలు లేకుండా కావలాకాయు (పెట్రోలు) నౌకలు గ్రీనులండు వరకు రావచ్చునని అధ్యక్షుడు ప్రకటించెను. గ్రీనులండు రేవులవరకు సరకు రవాణాను యీ నౌకలే కాపాడగలవు. నౌకలను కాపాడుటే యిపుడు ప్రధానావసరంగా ఉంది. "ఇంగ్లాండుకి చేసిన వాగ్దానాలు నిలబెట్టుకోవాలి. ఇచ్చిన సరకు ఇంగ్లాండు చేరేలాగు చూడాలి. మన యుద్ధసరకు ఇంగ్లాండుకి చేర్చనిచ్చినచో హిట్లరు ఓడిపోవును. కావున అతడు నిరోధించును. మన సరకు నౌకలను అతడు ముంచివేసినచో మనం ఓడిపోతాం" అని అమెరికా నౌకాదళ మంత్రి నుడివెను.

### అమెరికా సానుభూతి ప్రకటనలు.

"అమెరికాకు విరోధమగు సైనికశక్తులు చుట్టవేయుచున్నవి. అక్ష-రాజ్యాలు అనుకూల సమయం చూసుకొని మనపై యుద్ధం ప్రారంభిస్తాయి. ఈ ప్రపంచ యుద్ధంలో ఇంగ్లాండుకి సహాయంచేస్తామని మనం వాగ్దానంచేసేము. ఇపుడు వెనుకకుపోరాదు. వెనుకాడినచో ఇంగ్లాండు ఓడిపోవును. అపుడు మనం జర్మనీని ఒంటరిగా ఎదుర్కొనవలసియుండును. అన్యాక్రమణకుగడంగిన రాజ్యం గెలువకుండా చేస్తామని మనం యిదివరకు ప్రకటించియున్నాము. యూరోపులో చిన్న దేశాలకు అభయం యిచ్చేము. బ్రిటిషు సామ్రాజ్యం భవిష్యత్తుపైనే మన భవిష్యత్తు ఆధారపడియున్నదన్నాము. ఇపుడు వెనుకాడ వీలులేదు" అని అమెరికా మంత్రి కర్నలు నాక్సుగారు ప్రకటించెను.

అమెరికా దేశీయాంగ మంత్రియగు కార్డెలుహల్లుగారు, యీ మాటలనే ధృవపరుస్తూ వేరొక ప్రకటన చేశారు. ఇపుడు అక్ష-రాజ్యాలతో సంధిచేసుకొనుట జర్మనీవలలో పడినట్లే అగును. "ఇంకను స్వాతంత్ర్యంతో మిగిలియున్న దేశాలన్ని కలసి వీలయినంత త్వరలో సైన్యాలను చేకూర్చి స్వరక్షణకై పోరాడాలి. ఇంగ్లీషు ఛానలు దాటలేకపోయినారు కనుక, అట్లాంటికు సముద్రాన్ని కూడా జర్మనులు దాటలేరను వాదము నేనంగీకరింపను. ఇంగ్లీషు ఛానలు దాటలేకుండుటకు, ఇంగ్లాండులోనున్న నాల్గు కోట్ల ప్రజల ధైర్యసాహసములే కారణముగాని, సముద్రంలో నీరు కాదు. సముద్రాలపై అధికారం మిత్రమండలికి తప్పిపోయినచో, విజయుడగు హిట్లరునకు అట్లాంటికు పెద్ద నిరోధంకానేరదు. కావున యిపుడు ఇంగ్లాండుకి మన సహాయం ఎంతవేగంగా, ఎంత ఎక్కువగా పంపుతే అంత మంచిది" అని వారు చెప్పిరి. అమెరికా అధ్యక్షుడు గూడ గత వారం అన్నివిధములగు సహాయం చేస్తామని ప్రకటించినాడు.

అందుకనే బ్రిటిషు ప్రధాని చర్చిలుగారు తమ ఉపన్యాసంలో అమెరికా అధ్యక్షుడు సామాను నౌకలకు తైనాతిగా అమెరికను పెట్రోలు నౌకలు పంపుతానని చేసిన వాగ్దానాన్ని ప్రశంసిస్తు, యికముందు తమ బ్రిటిషు నౌకాదళం చేరువ సముద్రమార్గాలను కాపాడుటకు ఎక్కువ శ్రద్ధ వహించగలదని చెప్పిరి. "అమెరికా అధ్యక్షుడును, కాంగ్రెసు (శాసనసభయు) ఓటరుల అనుమతిని బడసి, బ్రిటనుకి యీ యుద్ధంలో పూర్తిగ సహాయం చేస్తామని వాగ్దానం చేసిరి. ఆ సహాయం ఇంగ్లాండు చేరకుండా సముద్రాల అడుగుకిపోయి, తమ శ్రమ అంతా వృథా అవడానికి వీలిస్తారని నేను నమ్మను" అని చర్చిలుగారనిరి.

"ప్రపంచంలోకెల్ల ఎన్నదగిన మిత్రుని మనం సంపాదించేము. అమెరికాయొక్క సానుభూతి, సంపద అంతా మనకు బలంగా ఉంది. అందుచే తప్పక గెలుస్తామని ధైర్యంగా చెప్పగలం. అమెరికా కుంభకర్ణున్ని నిద్రనుండి మేలుకొలుప కలిగినందుకు హిట్లరుకి మనం కృతజ్ఞత తెలుపాలి. అమెరికా మేలుకొంది కనుకనే రూజువెల్టు తిరిగి ఎన్నుకొనబడెను. అరువు కౌలు చట్టం ఆమోదించబడింది. అమెరికా ప్రజాభిప్రాయం అంతా మనకు తోడయింది. అమెరికా యింకా ముందుకి రాగలదు" అని దూరదృష్టిగల రాజకీయవేత్త స్మట్సు సేనాని గతవారం చెప్పెను.

---

## కష్టాలు, ధైర్య సాహసాలను ఎక్కువ చేసేయి:

### లండనులో ఒక స్త్రీ అనుభవాలు.

ఇంగ్లాండులో స్త్రీలు, పురుషులు, బిడ్డలు ఆబాలగోపాలం జర్మనుల దారుణదాడిని ధైర్యంతో ఎదుర్కొని, కష్టాలను ఓర్పుతో భరిస్తున్నారని అనేకమంది పైదేశాలవారు నిష్పాక్షికంగా చెపుతున్నారు. సంఘంలో అన్ని తరగతులవారికి ఒకే విధంగా కష్టాలు కలుగుచున్నందున, సాంఘికసఖ్యత, అన్యోన్య సహాయాభిలాష ఎక్కువగుతున్నాయి. ఇండియానుండి పోయి లండనులో, సహాయకార్యములు చేయుచున్న ఒక స్త్రీ, ఐ.సి.ఎస్. ఉద్యోగి భార్య, తన అనుభవములను, ఇచటనున్న తన స్నేహితురాలికి యీ దిగువరీతిగ వ్రాసింది.

"మీకు రేడియో ద్వారాను, పత్రికలద్వారాను వార్తలు తెలుస్తూనే వుంటాయి. కాని మీకు తెలియనివిషయం యింకోటిగలదు. ఇన్ని నెలల కష్టాలను ప్రత్యేకవ్యక్తులు ఎట్లు భరిస్తున్నారో, వారికి దీనివలన ఎట్టి అభిప్రాయాలు కలుగుతున్నాయో మీకు తెలియకపోవచ్చు. లండనులో తూర్పుకొసను, రేవు ప్రాంతాలయందు నేను నాల్గు నెలలనుండి పని చేయుచున్నాను. ప్రజలెట్లు అనుకుంటున్నారో నే నెరుంగుదును. ప్రతీ ఒక వ్యక్తి చస్తేనేగాని మనం ఓడింపబడజాలం. పగలంతా యిదివరకుకన్న ఎక్కువకష్టపడి, ఎట్టి వినోదాలు కోరక, రాత్రి అయేసరికి నేలగుహలలో దాగొని

ఉన్నది తిని, పండుకుంటే పండుకోడం, లేకుంటే మేలుకొని కూర్చోడం—యీ జీవితానికి అందరు అలవాటుపడ్డారు. విమానాలరొదకు అలవాటు పడిపోయేరు కనుక నిద్రాభంగం జరుగదు. ఒక బాంబు దగ్గరలో పడినా "నామీద పడలేదుకదా, బ్రతుకు జీవుడా"యని ప్రక్కతిరిగి పండుకుంటారు. మీదపడి చస్తే చింతేలేదు.

## స్త్రీల ఐచ్ఛిక సేవాదళం.

"విమాన దాడివలన నష్టపోయిన ప్రాంతాలలో డజనుల కొలది బిడ్డలుగల కుటుంబాలకు వస్త్రములు పంచియిచ్చుపని నాకు ఒప్పగించేరు. అనేక రకాల గుడ్డలు మంచివి చెడ్డవి, చిన్నవి పెద్దవి ఎక్కడనుండో వచ్చిపడుతూ ఉంటే, వాటికొరకై ఆదుర్దాతో చేతులుజాచి ప్రజ తీసుకుంటూ ఉంటారు. అదివరకు మహామహా జరీదుస్తులు వేసుకునేవారు, యిపుడు చింకిపాతలు లభించినందుకే సంతోషించవలసి వస్తున్నది. మా సేవాదళంవారు యీ పని పూనుకున్నాక, ఒక మంచి పద్ధతి ఏర్పాటుచేసిరి. ఏ ప్రాంతంలో ఉన్న స్త్రీలు ఆ ప్రాంతంలో క్రొత్త గుడ్డలు అల్లవలెనని, కుట్టవలెనని నిర్ణయించితిమి. వారు సంతోషంగా పనిచేస్తున్నారు. దాడి రాగానే ఒక స్త్రీ తన భర్తను ఆవూరునుంచి ఎక్కడికో తీసుకపొమ్మంది. ఈ బట్టలపని పురమాయించినాక, తన భర్తకు పనిచేయడంలో యీపని ఆలశ్యమవుతున్నాదే అని విచారిస్తూ, ఎక్కువ శ్రద్ధతో సహాయం చేస్తున్నది.

అమెరికను రెడ్డుక్రాసు సంఘంవారు ఎన్నోరకాల వస్త్రములను పంపుచున్నారు. లండను ప్రజలకు ఆ క్రొత్తరకాల పొడుగు పైరాయిలు తొడుగుటను అలవాటు లేకపోయినా, సంతోషంతో స్వీకరిస్తున్నారు. పోప్లారు కేంద్రమున, నేతపనిచేయుచున్న చోటికి అమెరికా రెడ్డుక్రాసు సంఘోద్యోగులు కొందరువచ్చి ధనసహాయం చేస్తామన్నారు. ఒక వేయి పౌనులను కోరగా ఏడువేల పౌనులు ఒసంగిరి.

"ఈ దాడులవలన ప్రజలకు నిరుత్సాహం, అపోహలు, ఆడంబరాలు పోయినాయి. ప్రమాదాల నెదుర్కొనే ధైర్యం, నిర్లక్ష్యం ఎక్కువయినాయి. బాంబును తప్పించుకోవడం ఒక ఘనకార్యంగా చెప్పుకుంటూ ఉంటారు. యిళ్లుపోతే నేం, క్రొత్తయిండ్లకు క్రొత్తచోట్లకు పోతాం అనే ధైర్యంతో ఉంటున్నారు. ఆంగ్లేయులందరిలో యిట్టి నూతనోత్సాహం రగుల్కొన్నది. కష్టాలుపడడమే ఒక అదృష్టంగా సంతోషంగా ఎంచుచున్నారు.

"ఇండియాలో వున్నపుడు యీ యుద్ధం అంటే నేను ఎంతో ప్రమాదంగాను, విహ్యంగాను చూచేను. ఇపుడు యిక్కడ జరుగుతున్నది స్వయంగా చూచినాక, ప్రజా మోక్షమునకు క్రీస్తు శిలువ శిక్ష ఎంత అవసరమో, యీ యుద్ధంలోని కష్టాలుకూడ అంత అవసరమని ఎంచుచున్నాను. దీనివలన ప్రజల స్వార్థబుద్ధి నశించి, మనోవికాసం కలుగుచున్నది."

# డచ్చి తూర్పు దీవులు—జపాను ఆశలు.

జపాను విదేశాంగ మంత్రియగు మట్సుఓకాగారికి జర్మను పద్ధతులంటే ఎంతో యిష్టం; హిట్లరంటే ఎంతో అభిమానం. ఇతడు కొన్ని సమయాలందు హిట్లరులాగ వేషం వేసుకొని మురిసిపోతూ ఉంటాడుట. వీలయితే జాపానులో సాంఘిక జీవితమంతా జర్మనులోవలె మార్చివేసే సంకల్పం యితనికి ఉంది. ఇతర దేశాలను బెదరించడంలో జపాను జర్మనీని బాగా అనుసరించింది. సయాంపై (థాయిలాండు) బాగా అధికారం సంపాదించింది. ఫ్రెంచివారిదగు ఇండో-చీనాలో చాల సౌకర్యాలు పొందింది. ఇంకా జపాను ఆశకు మితిలేదు. ఇండో-చీనా తనకు పూర్తిగ వశమయిపోలేదని జపాను చింతిస్తున్నది. ఇండో-చీనా ఉత్తర భాగంలో జపాను విమానాశ్రయాలు కట్టుకుంది. క్రొత్తవాటికొరకు సర్వే చేస్తున్నది. ఆదేశంలో వలస స్థాపించుకొనే అవకాశాలుగూడ విచారించుటకు కొందరిని జపాను పంపుచున్నది. ఆహార పదార్థములు, మందులు ఆస్పత్రి సౌకర్యములు ఎంతవరకుగలవో తెలిసికొనుచున్నది.

కాని జపానుయొక్క ముఖ్యమగు ఆశ డచ్చి తూర్పు దీవుల నాక్రమించుట. ఈ దీవులతో వ్యాపారాభివృద్ధి చేసుకొని అచటి సరకు సంపాదించుటేగాక, తన దేశంలో అధికంగాఉన్న జనులనుగూడ ఆ దీవులలోదింపి వలస రాజ్యం ఏర్పరుపదలచెను. డచ్చి తూర్పు దీవులందు జావా, సుమత్రా అను రెండు పెద్ద దీవులు కలవు. తరువాత బోర్నియో అను పెద్ద దీవికలదు. దీనిలో మూడోవంతు బ్రిటిషువారిది. సెలిబిసు, న్యూగినియాలో సగం భాగం (పాపువా అంటారు) కూడ డచ్చివారిదే. ఇదిగాక మొలుక్కాసు మున్నగు చిన్న చిన్న దీవులు అనేకం కలవు. వీటన్నింటికి మలయ అర్చిపెలుగో అని, లేదా స్పైసు ఐలండ్సు అని అనేక పేర్లు కలవు. వీటిలో ముడిసరుకులు చాలాదొరుకును. ఇక రాజకీయంగా వీటి ప్రాముఖ్యత చెప్పనే అక్కరలేదు. పూర్వప్రాచ్యం దక్షిణ ఆశియాలను, ఇండియా పెరిషియను గల్ఫు మధ్య ప్రాచ్యములద్వారా యూరోపుతో కలుపుటకు మధ్యలంకెగాయున్నవి. పూర్వప్రాచ్యానికి యితర మార్గాలుకూడా ఉన్నాయి. అవి సైబేరియా రైల్వే, బర్మారోడు. కాని యీ మార్గాలకన్న డచ్చి దీవులమీదుగ సముద్రమార్గాలే సురక్షితమయినవి. కావున యీదీవులలో వలస యేర్పరచుకొని, తన జనసంఖ్య ఒత్తిడిని తగ్గించుకొని అచటి ముడిపదార్థములన్ని తీసుకొని తన పరిశ్రమల సరకులు విక్రయించుకొనుటకు మార్కెటు సంపాదించి, పూర్వప్రాచ్యపు వర్తకమునంతా తన చేతిలో ఉంచుకొనుటకు జపాను ప్రయత్నించుచున్నది.

కాని జపానుయొక్క యీ ఆశలకు తీవ్ర విరోధంగా అమెరికా, బ్రిటిషు శక్తులుకలవు. దక్షిణాన సుమాత్రాకు చేరువగ మలయ ద్వీపకల్పం కొసను సింగపూరు రేవులో బ్రిటిషువారు సైనికశక్తిని చాల ఎక్కువగ పెంచి కాచుకొనియున్నారు. సర్ రాబర్టు బ్రూకు పాఫేముగారు అచట సేనాధికారిగా ఉన్నారు. తగినంత ఆహారపదార్థములు ఆయుధసామగ్రి జతపరచియుంచిరి. కొద్ది నెలలనుండి యీ ప్రాంతాలలో జపానువారి ఎత్తులు విఫలమైనవి. జపాను ఆస్ట్రేలియాతో సఖ్యతగనున్నది. ఈ ప్రాంతాలలో అనుమానమగు చర్యలేవయినా చేస్తే, వెంటనే ప్రతికూల చర్యగైకొంటామని ఆస్ట్రేలియా జపాన్ని హెచ్చరించింది కూడాను.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరుచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.